# బొకుడెన్, గర్వపోతు

## జపాను జానపద కథ



# బొకుడెన్, గర్వపోతు

జపాను జానపద కథ

తిరిగి చెప్పినది: స్టీవెన్ క్రెన్‌స్కీ

తెలుగు: కె. సురేష్





# నౌక షికారు

సుకహారా బొకుడెన్ కులీనుడు. అంతేకాదు, కత్తి యోధుడు కూడా. అతనికి ప్రపంచం గురించి తెలుసుకోవాలన్న కుతూహలం కూడా ఉంది. అందుకనే అతనికి ప్రయాణాలు ఇష్టం. మిగిలిన వాళ్లతో కలిసిపోటానికి అతను సాధారణ బట్టలు వేసుకునేవాడు. ఒంటరిగా ప్రయాణించేవాళ్లకి ప్రమాదాలు ఎదురు కావచ్చు కాబట్టి వెంట అతని కత్తి కూడా ఉండేది. కొత్త ప్రదేశాల నుంచి, కొత్త వ్యక్తుల నుంచి చాలా విషయాలు నేర్చుకోవచ్చు. బొకుడెన్‌కి ఎప్పుడూ నేర్చుకోవాలని ఉంటుంది.



ఒక ప్రయాణంలో బొకుడెన్ ఒక నది దగ్గరకు వచ్చాడు. నది ఒడ్డున ఉన్న ఒక పడవ ప్రజలను నదిని దాటిస్తోంది.

పడవ ఎక్కటానికి ప్రయాణీకులు ఒక వరసలో నిలబడ్డారు. బొకుడెన్ కూడా మిగతా ప్రయాణీకుల అందరి లాగా వరసలో ఓపికగా ఉన్నాడు. ఒక్క వ్యక్తి మాత్రం అలా లేదు.

ఒక సైనికుడు అందరినీ తోసుకుంటూ ముందుకు వెళ్లటానికి ప్రయత్నిస్తున్నాడు. ఒడ్డూ, పొడవులో అతను అందరినీ మించి ఉన్నాడు.

ఒక రైతు భుజం పట్టుకుని, “నువ్వు నా చోటులో నిలబడ్డావు. పక్కకి తప్పుకో," అన్నాడు సైనికుడు. అతని ప్రవర్తన చూసి రైతు ఆశ్చర్య పోయాడు. “ఇది నీ చోటు కాదు. నువ్వు ఇప్పుడే వచ్చావు," అన్నాడు రైతు.





"అది నిజమే. కానీ, నేను ఇక్కడ నిలబడాలని అనుకుంటున్నాను. కాబట్టి, ఇది నా చోటు," సైనికుడు అన్నాడు. దానికి రైతు, "ఇది న్యాయం కాదు. నేను గంట నుంచి ఇక్కడ నిలబడి ఉన్నాను. నువ్వు సైనికుడివి, చట్టాలను కాపాడాలి కదా," అన్నాడు.

"ఇక్కడ నేను చెప్పిందే చట్టం," అన్నాడు సైనికుడు. "నా కత్తిని చూశావు కదా. దానిని ఉపయోగించటం నాకు తెలుసనే అనుకుంటున్నావా? లేక నీ మీద ప్రయోగించి చూపించనా?"

సైనికుడు తన మాట వినటం లేదని రైతుకి అర్థం అయ్యింది. అతడు బాగా వంగి దండం పెట్టి,"నా దగ్గర ఏ ఆయుధాలూ లేవు. ముందూ వెనకా చూసుకోకుండా నేను మాట్లాడాను. నన్ను మన్నించండి. నా చోటు తీసుకోండి," అన్నాడు.

"ఇప్పుడు బాగా చెప్పావు. వరసలో నిలబడటం నీకు ఇష్టం కాబట్టి వెనక్కల్లా వెళ్లి నిలబడు," అన్నాడు సైనికుడు. అలా చెయ్యటం తప్పించి రైతుకి వేరే దారి లేకపోయింది.







## నదిని దాటటం

పడవకి సరిపడా ప్రయాణికులు ఎక్కిన తరవాత అది బయలుదేరింది.

ఆ రోజు ఎండ వెచ్చగా ఉంది. బొకుడెన్ కళ్లు మూసుకుని ఆ చక్కని వాతావరణాన్ని ఆస్వాదిస్తున్నాడు.



సైనికుడు పడవ అంతా తిరుగుతూ మరొక రైతుని, “పక్కకి జరుగు!" అన్నాడు.
“నేను ముందు నుంచి ఇక్కడ నిలబడ్డాను," అతను బదులు ఇచ్చాడు.
“అయితే ఏంటి?" సైనికుడు అడిగాడు.
“నేను ఇక్కడి నుంచి నదిని చూడాలనుకుంటున్నాను. నా దగ్గర ఉన్న కత్తిని చూశావా? దానిని ఉపయోగించటం నాకు తెలుసనుకుంటున్నావా?"
ఆ రైతు కూడా బాగా వంగి దండం పెట్టాడు. “ఈ చోటు గురించి మీతో పోట్లాడాలని నాకు లేదు," అంటూ అతను అక్కడినుంచి వెళ్లిపోయాడు.

ఒక ధనిక వ్యాపారికి ఆ సైనికుడి ప్రవర్తన నచ్చలేదు. “నువ్వు చేసింది సరైనది కాదు," సైనికుడితో వ్యాపారి అన్నాడు. “దానిని సరిచేద్దామని అనుకుంటున్నావా?" సైనికుడు కోపంగా అడిగాడు.

“లేదు, లేదు," భయంతో పాలిపోతూ అన్నాడు వ్యాపారి. “నేను అందుకు తగిన వ్యక్తిని కాను."

“నిన్ను ముక్కలు ముక్కలు చేస్తే ఎందుకూ పనికిరాకుండా అవుతావు," అన్నాడు సైనికుడు.

వ్యాపారి మరింత భయపడి, “నా మాటలకు మన్నించు," అన్నాడు.

“నీ నాలుక కోసేస్తే ఇటువంటి పరిస్థితి మళ్లీ రాదు," అన్నాడు సైనికుడు.



“భయపడుతున్న కోడిపిల్లల లాగా ఉన్నారు," ప్రయాణీకులతో సైనికుడు అన్నాడు. “మీ మీ చోటుల్లో జాగ్రత్తగా ఉండండి."

ప్రయాణీకులందరూ ఆ సైనికుడికి దూరంగా జరిగారు. అతనికి దగ్గరలో బొకుడెన్ మాత్రం ప్రశాంతంగా, కళ్లు మూసుకుని ఉన్నాడు.



సైనికుడు తన కత్తిని తీసి పైకి, కిందకి ఝుళిపించాడు, ముందుకి పొడిచాడు, వెనక్కి లాగాడు.
"అందరూ అలా ఎందుకు చూస్తున్నారు?" సైనికుడు అడిగాడు. "ఎవరైనా ఏదైనా చెప్పదలుచుకున్నారా?"

ఇద్దరు పిల్లలు చేతులు ఎత్తారు.
"ఏమిటో చెప్పండి," అన్నాడు సైనికుడు.
"మీరు చాలా యుద్ధాలు చేశారా?" ఒక పిల్లవాడు అడిగాడు.
"లెక్కపెట్టలేనన్ని!" సైనికుడు బదులిచ్చాడు.




“మీకు ఎప్పుడైనా దెబ్బలు తగిలాయా?" ఒక
అమ్మాయి అడిగింది.
“నేను ఎదుటివాళ్లను దెబ్బ కొడతాను,
ఎప్పుడూ దెబ్బ తినను," సైనికుడు చెప్పాడు.
ఎవరో కెక్కెక్కని నవ్వినట్టు అనిపించింది.
“ఎవరది?" అంటూ సైనికుడు కోపంగా చుట్టూ
కలయచూశాడు. ఎవరూ మాట్లాడలేదు.



# భిన్నమైన కళ

ఆ నిశ్శబ్దంతో సైనికుడు సంతృప్తి చెందలేదు. "నవ్వింది ఎవరో కనుక్కుంటాను. వాళ్లు దానికి మూల్యం చెల్లించక తప్పదు," అన్నాడు సైనికుడు. మళ్లీ అదే నవ్వు వినిపించింది. ఈసారి సైనికుడు బొకుడెన్ దగ్గరకు వెళ్లాడు. అతడి వంక తేరిపార చూశాడు.

"ఇదిగో, నిన్నే," సైనికుడు పిలిచాడు. బొకుడెన్ కళ్లు ఇంకా మూసుకునే ఉన్నాడు. చూపుడు వేలుతో అతని భుజం మీద పొడుస్తూ, "నీతోనే మాట్లాడుతున్నాను," అన్నాడు సైనికుడు.

బొకుడెన్ కళ్లు తెరిచి, "నేను ఒక అందమైన కల కంటున్నాను," అన్నాడు. "అది ఎలా ముగుస్తుందో నువ్వు చెప్పలేవనుకుంటా," అన్నాడు సైనికుడు.



సైనికుడు కఠోరంగా నవ్వాడు. "నీ కల ఏమైతే నాకు ఎందుకు. ఇక్కడ ఉన్న పురుగులతో పోలిస్తే నీకు గట్టి వెన్నెముకే ఉన్నట్టుంది. నా కత్తి నైపుణ్యం ఎలా ఉంది?" అని సైనికుడు అడిగాడు. "నన్ను మన్నించాలి. మీరు ఏదైనా ప్రదర్శన ఇచ్చారా? కళ్లు మూసుకుని ఉన్నందువల్ల నేను చూడలేదు," అన్నాడు బొకుడెన్.



“అయితే ఇప్పుడు చూడు," అంటూ సైనికుడు మళ్లీ తన కత్తితో ప్రదర్శన ఇచ్చాడు.
తరవాత బొకుడెన్ వైపు తిరిగి, “ఎలా ఉంది?" అని అడిగాడు సైనికుడు.

“ముచ్చటగా ఉంది," బొకుడెన్ అన్నాడు.
“ముచ్చటగానా! వంద మందిలో ఒక్కరికి కూడా ఇటువంటి నైపుణ్యం ఉండదు," అన్నాడు సైనికుడు.
బొకుడెన్ చుట్టూతా చూసి, “వంద మంది ఇక్కడ లేరు కాబట్టి నీ మాట నిజమనుకోవాలి," అన్నాడు.





బొకుడెన్ వైపు వేలు చూపిస్తూ,
“నువ్వు కూడా కత్తి యోధుడివే కదా?
లేక నీ కత్తి కేవలం
అలంకారానికేనా?" అడిగాడు
సైనికుడు.
సైనికుడి వైపు స్థిరంగా చూస్తూ
బొకుడెన్ ఇలా అన్నాడు: “నీ కంటే
భిన్నమైన కళను నేను సాధన
చేస్తాను. నా ఉద్దేశం ఇతరులను
ఓడించటం కాదు, నేను
ఓడిపోకుండా ఉండటం. నేను
కత్తులు లేని కత్తి యుద్ధం చేస్తాను."



సైనికుడు పెద్దగా నవ్వాడు. “ఇటువంటిది ఇంతకు ముందు నేను వినలేదు. ఈ కళ నీకు ఉపయోగపడిందా?" అని అడిగాడు.
బొకుడెన్ తన రెండు చేతులు బార్లా చాచి, “ఇప్పటివరకు బాగా ఉపయోగపడింది," అన్నాడు.
సైనికుడు మళ్లీ నవ్వాడు. “కత్తులు లేని నీ కత్తి యుద్ధాన్ని చూడాలని ఉంది," అన్నాడు. “అలాగే," బొకుడెన్ అన్నాడు.

బొకుడెన్ చుట్టూ చూసి, “ఈ పడవ మీద తగినంత చోటు లేదు. మనం ఒక చిన్న పడవ తీసుకుని ఆ దీవి మీదకు వెళదాం," అంటూ ఒక దీవి వైపు చూపించాడు.

“అక్కడ మనకి కావలసినంత చోటు ఉంటుంది," అని సైనికుడు అందుకు ఒప్పుకున్నాడు. చిన్న పడవ మీద వెళుతున్న వాళ్లిద్దరినీ పడవ మీద ఉన్న మిగిలిన వాళ్లు చూస్తూ ఉన్నారు.





## ఒక కత్తితో యుద్ధం

బొకుడెన్, సైనికుడు ఆ దీవిని చేరుకున్నారు. సైనికుడు వెంటనే ఒడ్డు మీదకి దూకి తన కత్తిని ఝుళిపించసాగాడు.
ఆ పోటీని వెంటనే మొదలుపెట్టాలని అతడు ఆతృత పడుతున్నాడు.

సూర్య కిరణాలకు సైనికుడి కత్తి మెరిసింది. పెద్ద పడవలోని ప్రయాణికులు ఇదంతా చూస్తూ ఉన్నారు. సైనికుడి కత్తి మెరుపులా ఉంది. అంతటి భయంకర సైనికుడి మీద ప్రశాంతంగా ఉన్న ఈ అపరిచితుడు ఎలా గెలుస్తాడు?

సైనికుడి ఆలోచనలు కూడా అదే విధంగా ఉన్నాయి. అయితే అతను ఒక విషయం గమనించ లేదు. అతనితోపాటు బొకుడెన్ ఒడ్డుకి రాలేదు. అతను ఇంకా ఆ చిన్న పడవలోనే ఉన్నాడు.





"తొందరగా రా," సైనికుడు అన్నాడు. "ఈ పోటీ ముగించటానికి నాకు ఎంతో సమయం పట్టదు. నీ మీద జాలి చూపిస్తానని అనుకోవద్దు. నీకు చిటికెలో మోక్షం ప్రసాదిస్తాను."



అందుకు బదులుగా బొకుడెన్
మాట్లాడకుండా తెప్ప వెయ్యసాగాడు.
“ఎక్కడికి వెళుతున్నావు?" సైనికుడు
పెద్దగా అరిచాడు.
“పెద్ద పడవ మీదకి," బొకుడెన్
బదులిచ్చాడు.
సైనికుడు నవ్వసాగాడు, “యుద్ధం
మొదలుకాక ముందే పారి పోతున్నావు.
నువ్వు ఇంత పిరికిపందవా?"
“సుకహారా బొకుడెన్‌కి చాలా పేర్లు
ఉన్నాయి. వాటన్నిటికి అర్హుడిని
అవునో, కాదో. కానీ పిరికిపంద అన్న
పేరు మాత్రం ఎప్పుడూ రాలేదు,"
అన్నాడు బొకుడెన్.



ఆ పేరు విని పడవలోని వాళ్లందరూ ఆశ్చర్యపోయారు. జపాన్ లోకెల్లా బొకుడెన్‌ని మించిన కత్తి యోధుడు లేడు. ఆ పొగరుబోతు సైనికుడితో పోరాడటానికి అతను సిద్ధపడ లేదంటే అతని ప్రాణాన్ని కాపాడటానికే అయ్యుంటుంది.

“దీనినే కత్తులు లేని కత్తి యుద్ధం అంటారు," బొకుడెన్ చెప్పాడు. “గొప్ప సైనికుడివి అయినట్టే గజ ఈతగాడివి అయితే మన మొదటి పాఠం అయిపోయినట్టు." సైనికుడు పిడికిళ్లు ఝుళిపిస్తూ, అరుస్తుండగా బొకుడెన్ పెద్ద పడవ దగ్గరకు చేరుకున్నాడు.

అయిపోయింది

